ఓం

స్నేహలతాకవితాసంఘపుష్పము - 56

# శ్రీరామకోటీశ్వర తారావళి



గ్రంథకర్త

వాజపేయయాజుల రామసుబ్బారాయడు, బి. ఏ.,

కొల్లాపురము.

1937

# అభినందనము



శా. శ్రీరాముం గమలాక్షుఁగా, నజునిగా, శ్రీకంఠుఁగాఁ దత్త్వవి
స్తారజ్ఞాననిరూఢి గుర్తెఱిఁగి, శ్రద్ధాభక్తులం గొల్చి, సు
బ్బారాయాగ్రణి! రామకోటికృతిదివ్యస్తోత్రముంగూర్చి, దు
ర్వారాపారభవాబ్ధిమగ్నులకుఁ గూర్పంగంటి వాలంబముం.

ఉ. మేలొదవన్ నిగూఢముగ మిత్త్రుఁడు నీకెది కృష్ణమూర్తి, మ
ద్దాలికులోద్భవుండు భవతారకమంచును దెల్ప; దాని నీ
వోలి నగూఢవృత్తి నిఖిలోర్వికిఁ దెల్పితి తారకాళి ప
ద్యాలనుగూర్చి; మెచ్చఁదగు నార్య! భవత్కృతి, సుబ్బరాట్కవీ!

ఉ. అక్షరమూర్తిరాముఁ డఖిలాత్ముఁ డనంతుఁ డటంచు, నిర్వ్యళీ
కాక్షరపూర్ణతత్త్వపరమార్థరహస్యము లోకులెల్లఁ బ్రి
త్యక్షముగా గ్రహింప నిటు లక్షరపంక్తిని గూర్చిచూపి, నీ
వీక్షితి సుబ్బరాయ ! గడియించితి వక్షయకీర్తి, దక్షతన్.

గుంటూరు,
5-10-'37.

విద్వాన్ కాశీ వ్యాసాచార్యులు,
యు. యల్. సి. యం. హైస్కూలు
ప్రధానసంస్కృతోపాధ్యాయులు.



శ్రీ సత్పరదేవతాయై నమః

# తొలిపలుకు



మహారాజరాజశ్రీ మద్దాలి శ్రీకృష్ణమూర్తిగారిచేఁ బ్రోత్సహింపఁబడి నేనీ తారావళిని వ్రాయుభాగ్యమును బొందినాఁడను. వీరు గుంటూరుపురవాస్తవ్యులు. ప్రకృతము శ్రీజటప్రోలుసంస్థానాధీశ్వరి, ధర్మకల్పవల్లి, మహారాజ్ఞి శ్రీవేంకటరత్నమాంబామతల్లిచేఁ బోషింపఁబడుచుఁ గొల్లాపురమున నుద్యోగపదవియం దున్నవారు. వైద్యవిద్యయందుఁగూడ వీరు చక్కని ప్రవేశము గలవారు. విశేషించి పరమభక్తశిఖామణులు - శ్రీరామకోటీశ్వరుఁడు వీరి కిలువేల్పు. వీరి తండ్రిగారగు మహారాజశ్రీ పురుషోత్తము గారు కూడ రామభక్తులే. ఉగ్గుపాలనాఁటనుండియు వీరి కిట్టిదైవభక్తి పారంపర్యముగ సంప్రాప్తమగుచున్నది. "నిజదారసుతోదరపోషణార్థమై" యనుదినము మానవులు పాటుపడవలసినవారలయ్యుఁ జివరకు జీవితతరణోపాయమునకుఁ గూడఁ గొంతకాలము వినియోగించుట విజ్ఞానలక్షణముగదా!

"వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. దేహావసానపర్యంతంబు నారాయణచరణారవిందసేవనంబు కర్తవ్యంబు"

"పుట్టనిచావనిత్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి."

అనుపోతనార్యుని పరమభాగవతసిద్ధాంతంబు త్రికాలమందును మఱవరానివి. పరమేశ్వర తేజస్సందర్శనమునకును కైవల్యసంప్రాప్తికిని మానవులు తమదృష్టిని ప్రధానలక్ష్యముగ నుంచి భక్తిమార్గమున జీవయాత్రను గడపుకొనుట ముఖ్యకర్తవ్యము. బుద్బుదప్రాయ మగునీభౌతికశరీరముపైఁ గలయభిమానమును వదలి జ్ఞానులు మోక్షప్రాప్తికై ప్రతిక్షణమును యత్నింతురు. కావున మాకృష్ణమూర్తిమిత్రశేఖరుఁడుగూడఁ బెద్దలు పోవుమార్గమే శ్రేయస్కరమని యెంచి

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"

అనుగీతావాక్యములపైఁ గలనమ్మకముచే నిరంతర రామకోటీశ్వర ధ్యానావాహనాదిపూజానిష్ఠాగరిష్ఠుండై ప్రణవపార్థివరామకోటీశ్వరు నోపినకొలఁదిఁ జిత్రించుచు స్మరించుచుఁ దనహృదయమును, బుద్ధిని, భావమును, పవిత్రముగఁ జేసికొనుచుఁ గాల మానందమునఁ గడపుచున్నవాఁడు. ఈరామకోటిని వ్రాయుటలో వీరు నూతనమార్గమును ద్రొక్కిరి. ఈనవ్యమార్గమునకు సృష్టికర్తలును వీరే. ఈరామకోటి ప్రణవాకారమును పార్థివాకారమును గలిగి రామమయ మగుచున్నది. ప్రపంచమంతయు — "ఓం" కారమున లీనమై యుండె. ఈశ్వరుని ఘంటానాదమునుండి "రామా" యను నక్షరద్వయము మాఱుమ్రోగుచు 'ఓం' కారముతో నిమగ్నమైనదో యనునట్లు వీరు "ఓం శ్రీరామ"

అనుదివ్యాక్షరములను లింగాకారమున మనోహరముగఁ జిత్రించుచుందురు. ఇదియే వీరి రామకోటిరచనావిధానము. అనఁగా ఓంకార మొకకోటి. శ్రీకార మొకకోటి రామ మొకకోటి. వీరొకేరూపమున సర్వ మీశ్వరమయముఁ జేసి చిత్రించుచుఁ దాము తరించుటయేకాక యట్టివ్రాఁతప్రతుల ననేకుల కొసంగి వారినిఁగూడఁ దరింపఁజేయుచు వీరి యపూర్వచిత్రరచనానైపుణ్యమున భక్తలోకమున కాదర్శ పురుషులై విశేషసుకృతము నార్జించుచున్నవారు. వీరు వ్రాయుచున్న రామకోటీశ్వరాకార మిట్టిదని భక్తలోక మెఱుంగుటకుఁగాను ముఖపత్రమునం దలంకరింపఁబడియె. వేయేల ? వీరు కల్పించినప్రణవపార్థివరామకోటీశ్వరాకార మొకదేవాగారమువలెఁ బరమపవిత్రమై, యానందసంధాయకమై సర్వజనాకర్షకమై యున్నదనుట యతిశయోక్తి గాదు. అట్టిచిత్రపట మొకండు నాకును దయచేసి నన్నుఁ గూడ వారివలెఁ దరింపఁజేయవలయునని సంకల్పించి వారి నిత్యప్రార్థనమున కనువగురీతి ఛందోబద్ధముచేసి కవితాగానముసేయునవకాశము గల్పించినందులకు వారికి నాకృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాఁడను.

గీ. మాయలీలల వెల్గుసంసారసాగ
రమునఁ బడఁబోక పుణ్యమార్గం బెఱింగి
ప్రణవరామపార్థివమును వ్రాయుచున్న
పుణ్యతముఁడు మాశ్రీకృష్ణమూర్తిసఖుఁడు.

గీ. అట్టిఘనునకు సకలసౌఖ్యంబు లిచ్చి
యాయురారోగ్యసకలభాగ్యంబు లిచ్చి
పరిణవరామపార్థివకోటి వారియుశక్తి
నిచ్చి ప్రోచుత రామకోటీశ్వరుండు.

గీ. జ్ఞానకర్మేంద్రియసువృత్తి గలుగు కతన,
స్థిరతరాస్తికభావంబు వరలు కతనఁ
బరిణవరామపార్థివకోటి వారియుచుంటి
విద్ధ గుణవర్తి, మద్దాలి కృష్ణమూర్తి !

ఇట్లు బుధజనవిధేయుఁడు,

గ్రంథకర్త.



ఓమ్

# శ్రీ రామకోటీశ్వర తారావళి.



శా. శ్రీరాముండనఁ గృష్ణుఁడన్న మఱి గౌరీనాథుఁ డంచన్న నీ
పేరంచున్ మది నూహసేసి పిలుతున్ బేరాసతో నట్లె నీ
వేరూపంబున నుందువో తెలియరా దెవ్వారి కావంతయుం
జేరందీసి యనుగ్రహింపఁగదవే శ్రీరామకోటీశ్వరా! I

శా. నీచారిత్రము నీమహామహిమమున్ లీలావినోదంబులున్
ధీచాతుర్యము గల్గుబ్రహ్మయును వర్ణింపంగలేఁ డన్నచో
నేచందంబునఁ జెప్పనేర్తు నెదలో నేమంచు నూహింతు నా
వాచాదోషములెల్లఁజూడకుము దేవా! రామకోటీశ్వరా! 2

శా. నీతత్త్వం బిఁక దాపనేల? తెలిసెన్ నీలోనఁ గాన్పించెడిన్
భూతవ్రాతము లెల్లలోకములు నీమూలంబునన్ నిల్చెడిన్
జేతఃపద్మమునందు నీప్రతిమమున్ జెన్నారఁ బూజింతు నో
సీతానాథ! యనుగ్రహింపఁగదవే శ్రీరామకోటీశ్వరా! 3

మ. కలుగున్ సౌఖ్యము నిన్నుఁగొల్చుబుధభక్తశ్రేణి కెవ్వేళలన్
దొలఁగున్ దుఃఖము లెట్టివారికిని నిన్నున్ స్తోత్రము జ్జేయుచో
వెలుఁగున్ జంద్రికవోలెఁ గీర్తియును నీపే రొక్కమంత్రంబనన్
వెలయన్ జేసి జపించు సజ్జనులకున్ శ్రీరామకోటీశ్వరా! 4

మ. వల దేభోగము నాకు, సంసరణసౌభాగ్యంబు భోగించితిన్
గలిగెన్ సంతతిగూడ నట్టిసుఖ మింకం గోరఁ గాసంత నా
కిలలోఁగల్గెడు సౌఖ్యసంపదలపై నేవంబు పుట్టెన్ మదిం
జెలఁగెన్ మార్గ్వోకయింత నిన్నుఁగొలుతున్ శ్రీరామ ... 5

మ. అనయంబున్ భవదీయనామమును జిహ్వాంబాడుదున్ శ్రద్ధమై
మననింతున్ భవదీయసన్మహిమ మాత్మన్ నిత్యముంగాని ని
న్ననులారం గనుభాగ్యమేర్పడమి నెక్కాలమ్ముఁజింతింతు; ద
ర్శనభాగ్యంబిడి, చింతదీర్చు శ్రితరక్షా! రామకోటీశ్వరా!

మ అసహాయుండను మార్గమేదియును సుంతైనం గనన్ రాదు మా
నసమా భీతిపరీతమయ్యె సుఖమా నాకెందునున్ లేదు లో
విసుఁగుం జెందితిఁ గష్టకాలమొదవెన్ విశ్వేశ! విశ్వాత్మ! సం
తసమున్ జెందెద దర్శనంబొసఁగరాదా రామకోటీశ్వరా!

శా. చింతాకంతయు వాంఛలేదిఁక సుఖశ్రీఁగాంచి భోగింపఁ గా
సంతైనన్ గనుభాగ్య మిమ్ము భవదత్యానందరూపమ్ము గో
రంతైనన్ భవదీయపాదరజ మవ్యాజానురాగమ్ముతో
వంతల్ శాంతిల మాపయింబరపు దేవా! రామకోటీశ్వరా!

మ. కరుణాంభోనిధి వంచుఁ గాళ్ళఁబడితిం గాపాడఁగా రావె నే
శరణార్థిన్ భువి నీకృపాగరిమచే సాధింతు నేదైన నీ
చరణాబ్జంబులె దిక్కు నాకెపుడు కష్టం బందుచున్నాఁడ నీ
తరుణంబందునఁ గావరాదె గుణసాంద్రా! రామకోటీశ్వరా!

శా. దేవా! నీపదపద్మమే గొలుతు నీ తేజంబె కీర్తింతు నా
భావంబందున నీవిలాసములె సంభావించి మోదింతు న
న్నీవే రక్షణసేయుదంచు నెదలో నెల్లప్పు డూహింతు నా
కీవే దిక్కని నమ్మికొంటి నిఁకఁ దండ్రీ! రామకోటీశ్వరా!

మ. భువనంబుల్ సృజియించి పెంచుచు లయంబుం జేయునీశక్తి నీ
భువిలో నెవ్వరు సెప్పఁగాఁగలరు దేవుండన్న నీవంచు ని
న్నవిరామంబుగఁ గొల్చుచుండుదు ననన్యప్రాభవంబొప్ప న
న్నెవరున్ రక్షణసేయరారు కను మీవే, రామకోటీశ్వరా!

శా. నీవే తల్లివటంచుఁ దండ్రివనుచున్ నీవే గురుండంచు సు
శ్రీవర్ధిల్లఁగఁ జేయురాజవనుచున్ జేదోడువంచున్ గనన్
నీవే మత్కులదైవమంచు సతమున్ నిన్నే మదిన్ నిల్పి నీ
సేవల్ సేయుచునుంటిఁ గావఁగదవే శ్రీరామకోటీశ్వరా! 12

మ. కలలం దైనను నీస్వరూపమునె నేఁ గాంక్షింతుఁ జూడంగ నా
తలపై దుర్భరమౌ సతీసుతసముద్యద్బంధ మేలా? మహీ
తలమందున్ బశువృత్తి వర్తిలితి; వ్యర్థంబయ్యె జన్మంబు, న
న్నలసున్ ధన్యునిఁ జేసి ప్రోవఁగదె దేవా! రామకోటీశ్వరా!

మ. అనుమానంపడనేల వేదమనఁ గావ్యంబన్న గీతార్థమ
న్నను ధర్మంబనినన్ జపంబనినఁ బుణ్యంబన్నఁ దీర్థంబుల
న్నను దానంబనినన్ గుణంబనిన విజ్ఞానంబటన్నన్ వ్రతం
బనినన్ నీదగునామమంత్రమె కదయ్యా! రామకోటీశ్వరా!

మ. ఇలువేల్పంచును నిన్ను నమ్మితిని నన్నేదారి రక్షింతొ? నా
వలనన్ దోషములున్నఁ బ్రోవఁదగదా? వారింపఁగాఁజెల్లదా?
కలిదోషాపహ! దేవ! తావకకటాక్షశ్రీల దిక్కంచు: ద
త్కాళయే యెడ్గడయుంచుఁగొల్చెదనునాథా! రామకోటీశ్వరా!

శా. ఆయుర్భాగ్యము వృద్ధిసేయుమని నిన్నాసింపలే దెప్పుడే
యాయాసమ్మును లేనిజీవితమునం దాసల్ పిసాళించి, మ
జ్జాయాపుత్త్రులఁగూడి నిన్నుఁగొలుతున్ సౌఖ్యంబుచేకూరఁగా
శ్రేయఃప్రాప్తి నొసంగి ప్రోవఁగదవే శ్రీరామకోటీశ్వరా!

శా. పక్షంబుల్ దెగిపడ్డపక్షికరణిన్ బ్రాల్మాలియున్నాఁడ నీ
శిక్షల్ చాలును నాకు జ్ఞానమెటులో చేకూర్చి నన్బ్రోవఁగా
వీక్షింపన్వలెఁ గన్నపుత్త్రునివలెన్ బ్రేమింపు మోతండ్రి నన్
రక్షింపందగదా? శుభంబు లొదవంగా రామకోటీశ్వరా!

మ. తనువా బుద్బుద మాయువా క్షణిక మర్థంబా యనర్థంబు నే
ధనమైనన్ సిరులైన శాశ్వతములా? ధాత్రీతలంబందు నే
మనియాసల్ గొని ప్రాఁకులాడుదును భావాతీత! నిన్ నమ్మిచే
సినసేవల్ గనుపించు నిత్యమనుచున్ శ్రీరామకోటీశ్వరా!

మ. సతతాచారవిధానధర్మయుతసత్సాంగత్యమున్ సత్యమున్
ధృతియు న్భూతదయాపరత్వవిధులు న్దేజంబునున్ దెల్వియున్
మతియున్ శాంతము నిచ్చి యెల్లపుడు సన్మాన్యప్రకాండంబులం
దతుకంజేయుమ నాదుబుద్ధి పరమాత్మా! రామకోటీశ్వరా!

మ. పరమంబై రసవత్తరంబునయి సంపత్సారమై శ్రేష్ఠమై
నిరతానందదమై వినిర్మలమునై నిత్యంబునై భవ్యమై
సరసంబై మధురంబునై నెగడుసత్సారంబు నీపాద మేఁ
గరమొప్పన్ భజియింతు నార్తజనరక్షా! రామకోటీశ్వరా!

శా. శ్రీరామా! నను నీట ముంచెదవొ, యర్థిం బాలనే ముంచెదో
భారంబంతయు నీవ మోయవలయున్ బాలుండ నేనంచు నీ
కారుణ్యామృతవృష్టిఁ జిల్కినయెడన్ గార్యంబు లీడేరుఁ బ్రా
పై రక్షింపవె నన్ను భక్తజనరక్షా! రామకోటీశ్వరా! 21

ఉ. నేనన నెంతవాఁడ నవనీతలమం దొకమానవుండ ని
న్నానలినాక్షు దేవముఖు లట్టిరె గన్గొనఁజాలరన్న నేఁ
గానఁగనేర్తు నింకెటులఁ, గానకయుండఁగ నేర్తునెట్లు? ప్ర
జ్ఞానిధి! కానుపించఁగదె, గాంచి తరింతును రాఘవేశ్వరా!

గీ. ప్రణవపార్థివరామదైవం బటన్న
నీవయని నమ్మి నిన్ను వర్ణింప నెంచి
నీదునామరూపంబు లామోద మొదవఁ
గోటిగాఁగ వ్రాయఁగఁబూనుకొంటి నేను. 23

శా. జ్ఞానం బింతయు లేనిమూఢుఁడ నసంస్కారిన్ విమోహాంధుఁడన్
నేనేరీతి భవత్కృపాగరిమతో నెయ్యంబు వియ్యంబునన్
బూనన్ బాత్రుఁడ నౌదు? నాకృతికి మెప్పుల్ గల్గు నేరీతి? నీ
వే నిర్దుష్టము దీనిఁ జేయవలెఁ దండ్రీ! రామకోటీశ్వరా!

ఉ. తనయులు సేయుతప్పులను దద్దయుఁ దండ్రులు దిద్దురీతిగా
ననుఁ గృతకృత్యుఁ జేసి మలినంబును ద్రోసి క్షమింపుతండ్రి! నీ
వనిన దయాసముద్రుఁడ వటంచు నెఱుంగుదు నాదోసంగులన్
గనికరమూని దిద్దు; మెటుఁ గన్పడనీయకు రామపార్థివా!

ఉ. తారకమంత్రరాజజపతత్పరులౌ బుధు లందరాని వి
స్తారఫలంబు లే; దెసఁగు శాంతిసుఖంబులు, మోక్ష మబ్బు, నీ
తారకమంత్రముల్ సతమెదన్ జపియించెద భక్తితోడ నా
కోరిక లెల్లఁదీర్చు మనుకూలమతిం గని రామపార్థివా! 26

ఉ. భాగ్యము లబ్బు నీచరణపద్మము గొల్చినవారి కెల్ల నా
యోగ్యత నాకుఁగూడ నెటులో సమకూర్చుము దాననాకు సౌ
భాగ్యము గల్గు సౌఖ్యమును బ్రాప్తమగుం దుది నేను శుద్ధవై
వాగ్యముఁ బూని నీదరికి రాఁగలవాఁడను రామపార్థివా!

ఓం తత్సత్



# పండితాశీర్వాదములు



శ్రీరామాక్షర బాణము ల్ప్రణవమౌర్వి౯ లేఖినీచాపసం
సారారూఢి బిగించి మంత్రపటిమాసామర్థ్యదోశ్శక్తి సం
సారోద్భూతమహామయాసురుల భస్మం బేర్చి లోకార్తిఁబో
కార౯ జేయఁగ వెజ్జవైతి విలఁ గృష్ణారాయవిద్వన్మణీ!

భానుసహస్రదీధితులు పర్విన నుర్వియె చూర్ణమైన నం
భోనిధిసప్తకం బినికిపోయిన సప్తకులాచలంబు లే
మైనను గానరానిదశ నందిన శ్రీరఘురామపాదసే
వానిరతుం డచంచలపుపద్ధతి మానుకొనండు నెచ్చెలీ!

భవరోగకీటకపటలి నాహారింపఁ
బ్రకటకాకత్రోటి రామకోటి
తాపత్రయాగ్నిసందగ్ధమనుష్యసం
క్రందనవనవాటి రామకోటి
ముక్తికాంతాకరాంబుజ మవలంబింప
రా రమ్మటనుచేటి రామకోటి
అరిషట్కదనుజప్రాణాపహరక్రియా
రంభసాయకధాటి రామకోటి

గీ. భీకరజనుఃపరంపరాపీడ్యమాన
మానవాధమ సంసారకాననోగ్ర
సింహశార్దూలమృగములఁ జీల్చి కూల్చి
రక్షణమొనర్పఁ గలచీటి రామకోటి.

గీ. అట్టిరామకోటి నాధారముగఁ జేసి
పా్లుమాలఁబోక రేలుఁ బవలు
సంచరించు నిన్ను సాకుట శ్రీరామ
నృపతి మఱువఁ డెపుడు కృష్ణమూర్తి.

గాడేపల్లి వీరరాఘవశాస్త్రి,
శతావధాని, (గద్వాలసంస్థానవిద్వాంసుఁడు)

శా. శ్రీమాధుర్యరసైకపూర్ణకవితాసింధూర్మికామాలికా
ధామపే్రింఖితరామతారకమహాత్మ్యారావతారావళిన్
నామిత్రిం బగురామసుబ్బకవి సంధానించె నోహో! పర...
ధామా! మాకిదె 'రామరక్ష' యగుఁగాతన్ రామకోటీశ్వరా!

అచ్యుతుని వేంకటాచలపతికవి.

గీ. ప్రణవ శ్రీరామకోటిని వ్రాసి నీదు
తండ్రిసంకల్ప మీడేరఁ దగినరీతి
రామపదకంజముల సమర్పణము సేయ
నెంచినాఁడవు మద్దాలి కృష్ణమూర్తి.

ఉ. తారకమంత్రమే జపము; తప్పక పోషణ సేయు ధారుణిన్
గీరితిఁగన్నరాణి యవనీస్థలి వేంకటరత్నమాంబ నీ
కోరిక లింకఁ జేకుఱవె కొల్లపురంబున వాసమేర్పడన్
గారుణికంబు మీఱ సిరికాంతుఁడు నీ కిడు సర్వసంపదల్.

చేబ్రోలు సరస్వతీదేవి,
మీర్జాపురం ఎస్టేటు - నూజివీడు.

---

గుంటూరు, చంద్రికా ముద్రాశాలయందు ముద్రింపఁబడియె.